## ౨. శివ స్తుతి.



1 సీ॥ భూతాత్మ భూతేశ • భూతభావనరూప
దేవ మహాదేవ • దేవవంద్య
యీ లోకములకెల్ల • నీశ్వరుండవు నీవ
బంధ మోక్షములకుఁ • బ్రభుఁడ వీవ
యార్తశరణ్యుండ•వగు గురుండవు నిన్నుఁ
గోరి భజింతురు • కుశలమతులు
సకలసృష్టి స్థితి • సంహారకర్తవై
బ్రహ్మ విష్ణు శివాఖ్యఁ • బరఁగు దీవు
తే॥ గీ॥ పరమగుహ్యమైన • బ్రహ్మంబు సదసత్త
మంబు నీశ శక్తి•మయుఁడ వీవ
శబ్దయోని వీవ • జగదంతరాత్మవు
నీవ ప్రాణ మరయ • నిఖిలమునకు॥ అ॥ ప. ౬౨౨

2 క॥ నీయంద సంభవించును
నీయంద వసించియుండు • నిఖిల జగంబుల్
నీయంద లయముఁబొందును
నీ యాధారము సర్వభూత•నిలయమఁ సదా॥ అ॥ ప. ౨౨౪

3 సీ॥ అగ్నిముఖంబు ప•ర పరాత్మక మాత్మ
కాలంబు గతి రత్న•గర్భపదము
శ్వాసనంబు నీయూర్పు • రస నజలేశుండు
దిశలు కర్ణంబులు • దివము నాభి
సూర్యుండు గన్నులు • శుక్లంబు సలిలంబు
జఠరంబు [1]జలములు • చదలు శిరము
సర్వౌషధులు రోమ•చయములు శల్యంబు
లద్రులు మానస • మమృతకరుఁడు
తే॥ గీ॥ ఛందములు ధాతువులు ధర్మ•సమితి హృదయ
మాస్యపంచక ముపనిష•దాహ్వయంబు

1 జఁధులు.

మైన నీరూపు పరతత్త్వ♦మై శివాఖ్య
మై స్వయంజ్యోతియై యొప్పు♦ నాద్యమగుచు॥ ఆ॥ ప. 225

4 క॥ కొందఱు కలఁడందురు నినుఁ
గొందఱు లేఁడందు రతఁడు ♦ గుణిగాఁ డనుచుం
గొందఱు కలఁడని లేఁడని
కొందఱ మందుదురు నిన్నుఁ♦ గూర్చి మహేశా! ఆ॥ ప. 226

5 సీ॥ తలఁపఁ బ్రాణేంద్రియ ♦ ద్రవ్యగుణ స్వభా
వుఁడవు కాలక్రతు♦వులును నీవ
సత్యంబు ధర్మ మ♦క్షరము ఋతంబును
నీవ ముఖ్యుండవు ♦ నిఖిలమునకు
ఛందోమయుండవు ♦ సత్త్వరజస్తమ
శ్చక్షుఁడవై యుండు ♦ సర్వరూప
కామపురాధ్వర ♦ కాలగణాదిభూ
త [1]ద్రోహభయముచో ♦ ద్యంబుగాదు
తే॥ గీ॥ లీలలోచన వహ్ని స్ఫు♦లింగశిఖల
నంతకాదులఁ గాల్చి♦నయట్టి నీకు
శశిఖండావతంస పు♦రాణపురుష
దీనరక్షక కరుణాత్మ ♦దేవదేవ॥ ఆ॥ ప 227

6 ఆ॥ వె॥ మూఁడుమూర్తులకును ♦ మూఁడులోకములకు
మూఁడుకాలములకు ♦ మూలమగుచు
భేదమగుచు దీవ ♦ భేదమై యొప్పారు
బ్రహ్మమనఁగ నీవ ♦ఫాలనయన! ఆ॥ ప 228

7 తే॥ గీ॥ జగములకునెల్ల యోని బీ♦జంబులైన
శక్తి శివకారణుండవై ♦ జగతి నిర్వి
కార [2]బ్రహ్మంబవగు నిన్నుఁ ♦గడగి విశ్వ
నాథుఁగా నెఱిఁగెద నాయ♦నమున నభవ! చ॥ ప 145

8 తే॥ గీ॥ సమత నదిగాఁ దావకా♦శంబులైన
శక్తి శివరూపములఁ గ్రీ♦డసలుపు దూర్ణ

(1) ద్రోహచయము (2) కారతత్త్వంబవగు

నాభిగతి విశ్వజనన వి•నాశవృద్ధి
హేతుభూతుండవగుచుందు • వీశ! రుద్ర! చ॥ ప 146

9 క॥ సదసత్తత్వచరాచర
సదనంబగు నిన్నుఁ బొగడ • జలజభవాదుల్
పెదవులు గదలుప వెఱతురు
వదలక నినుఁ బొగడ నెంత•వాఁడను దేవా! అ॥ ప 229

10 క॥ నీకంటె నొండెఱుంగము
నీకంటెం బరులు గావ•నేరరు జగము
నీకంటె నొడయఁ డెవ్వఁడు
లోకంబులకెల్ల నిఖిల•లోకస్తుత్యా! అ॥ ప 232

11 సీ॥ అనఘ! లోకంబుల•యందు వర్ణాశ్రమ
సేతువులనఁగఁబ్ర • ఖ్యాతినొంది
బలిసి మహాజన • పరిగృహీతంబులై
యఖిలధర్మార్థ దా•యకములైన
వేదంబులను మది •వృద్ధినొందించుట
కొఱకునై నీవు •వటుని నిమిత్త
మాత్రునిఁ జేసి య•మ్మఖముఁ గావించితి
పటుగాన శుభమూర్తి •వైన నీవు
తే॥ గీ॥ గరగి జనముల మంగళ•కర్మలైన
హోమముక్తి నమంగళా•చారులైన
వారి నరకంబు నొందింతు • భూరిమహిమ
భక్తజనపోష! రాజిత • ఫణివిభూష! చ॥ ప 147

12 సీ॥ వఱి భేదబుద్ధిఁ గ•ర్మప్రవర్తనముల
మదయుతులై దుష్ట•హృదయులగుచుఁ
బరవిభవాసహ్య • భవమనో వ్యాధులఁ
దగిలి మర్మాత్మభే•దకములైన
బహుదురుక్తుల చేతఁ •బరులఁ బీడించుచు
నుండు మూఢులను దై•వోపహతులఁ

గాఁ దలపోసి య♦క్క పటచిత్తులకు నీ
వంటి సత్పురుషుఁ డే♦వలననైన
తే॥ గీ॥ హింసఁ గావింపకుండు స♦విద్ధచరిత
నీలలోహిత వహిత♦గుణాలవాల
లోకపాలనకలిత గం♦గాకలాప
హర జగన్నుతచారిత్ర ♦ యదియుఁగాక॥ చ॥ ప 149

13 క॥ లంపటుల నివారింపను
సంపదఁ గృపఁజేయ జయము ♦ సంపాదింపన్
జంపెడివారి [1]వధింపను
సొంపారఁగ నీక చెల్లు ♦ సోమార్ధధరా! అ॥ ప 231

14 సీ॥ దేవ జగన్నాథ ♦ దేవేంద్రవందిత
వితతచారిత్రసం ♦ తత పవిత్ర
హాలాహలాహార ♦ యహిరాజ కేయూర
బాలేందు భూష స♦ద్భక్తపోష
సర్వలోకాతీత ♦ సద్గుణ సంఘాత
పార్వతీ హృదయేశ ♦ భవవినాశ
రజతాచలస్థాన ♦ గజచర్మ పరిధాన
సురవైరి విధ్వస్త ♦ శూలహస్త
తే॥ గీ॥ లోకనాయక సద్భక్త♦లోకవరద
సురుచిరాకార మునిజన♦స్తుతివిహార
భక్తజనమందిరాంగణ♦పారిజాత
నిన్ను నెవ్వఁడు నుతిసేయ♦నేర్చు నభవ! ద॥ ప 320

15 ఉ॥ నిండుమతిం దలంతు: గమ♦నీయ భుజంగమ రాజమండలీ
మండనుఁ జంద్రఖండ పరిమండిత ♦ మస్తకుఁ దార మల్లికా
పాండురవర్ణు జండతరభండను ♦ హేమగిరీంద్రచాపకో
దండు మహేశు గంధగజ♦దానవభంజను భక్తరంజనున్॥
ష॥ ప 2

---

(1) హరింపను

16 ఉ॥ శంకర భక్తమానస వ•శంకర దుష్ట మదాసురేంద్రనా
శంకర పాండునీలరుచి • శంకరవర్ణ ని¹జాంగభోగి రా
ట్కంకణ పార్వతీహృదయ•కైరవ కైరవ మిత్ర యోగిహృ
త్పంకజ పంకజాప్త నిజతాండ•వఖేలన భక్తపాలనా!

ద॥ ప. 315



## 3. విష్ణు స్తుతి.



1 సీ॥ హరినామకథన దా•వానల జ్వాలలఁ
గాలవే ఘోరాఘ•కాననములు
వైకుంఠదర్శన•వాయు సంఘములచేఁ
దొలఁగవే బహుదుఃఖ•తోయదములు
కమలనాభధ్యాన•కంఠీరవములచేఁ
గూలవే సంతాప•కుంజరములు
నారాయణస్మర•ణ ప్రభాకరదీప్తిఁ
దీరవే షడ్వర్గ • తిమిరతతులు
తే॥ గీ॥ నలిననయనభక్తి•నావచేఁ గాక సం
సారజలధి దాఁటి • చనఁగరాదు
వేయునేల మాకు • విష్ణుప్రభావంబుఁ
దెలుపుమయ్య సూత • దీనమేత॥ ప్ర॥ ప. 50

2 గీ॥ కలసి పురుషమూర్తి • కాలరూపములను
లోకజనుల వెలియు • లోన నుండి
జన్మమృత్యువులను • సంసారముక్తుల
నిచ్చు నతనిచరిత•మెల్లఁ జెపుమ॥ డ॥ ప. 8

3 మ॥ యతచిత్తేంద్రియమారుతుం డగుచున్ • యత్నంబొనర్తున్ హరి
వ్రతసంపత్తికిఁ బుణ్యవృత్తికిఁ జిదా • వాసోన్ముఖాసక్తికిన్

---

(1) నిభాంగ.

యుత నిర్వాణపదానురక్తికి సుఖో•ద్యోగ క్రియాశక్తికిన్
ధృతిఁ బ్ధోత్తమ మూర్తికిన్ సకల ధా•త్రీధుర్యసద్భక్తికిన్॥
ష॥ ప. 148

4 క॥ ప్రియురాలివలని వార్తలు
ప్రియజనులకునెల్ల ప్రొద్దు • ప్రియమగు భంగిన్
బ్రియుఁడగు హరిచరితంబులు
ప్రియభక్తుల కెల్లయెడల • బ్రియములుగావే। ద॥ ప. 490

5 చ॥ మృదుగతిఁ బుష్పతేనియ ర•మించుచుఁ బానముసేయఁ బారు ష
[1]ట్పదమునుబోలి యార్త జన•బాంధవు విశ్వ భవ స్థితి వ్యయా
స్పద మహిమావతారుఁడగు • పంకరుహోదరు నిత్యమంగళ
ప్రదగుణ కీర్తనామృతముఁ • బాయక గ్రోలెదఁ జెప్పవే దయన్॥
తృ॥ ప. 195

6 ఆ॥ వె॥ ఏ మహాత్మువలన • నీ [2]విశ్వరూపంబు
గానఁ బడిన బుద్ధి • కంపమయ్యె
నా మహాత్ము విష్ణు • నఖిలలోకాధారు
నార్తు లెల్లఁ బాయ • నాశ్రయింతు॥ ద॥ ప. 346

7 క॥ మందప్రజ్ఞుఁడనై గో
విందుని మురదైత్యహరుని • విష్ణుని బరమా
నందుని నందతనూజుని
మందరధరుఁ జిత్తమందు • మఱతునె యెందున్॥ తృ॥ ప. 97

8 క॥ గజరాజవరదు గుణములు
త్రిజగ త్పావనములగుటఁ • దేటపడంగా
సుజనమనోరంజకముగ
విజితేంద్రియ వినఁగ నాకు•వేడుక పుట్టెన్॥ ఏ॥ ప 49

9 మ॥ భగవద్దివ్య [3]గుణానువర్ణన సుధా • ప్రాప్త్యైక చిత్తుండనై
బెగడన్సంగరణోగ్ర వైతరణికి • న్భిన్నాత్ములై తావకీ
య గుణస్తోత్ర పరాఙ్ముఖత్వమున మా•యా సౌఖ్య భావంబుల
న్నగతింగానని మూఢులన్గని మది•న్శోకింతు సర్వేశ్వరా॥ స॥ ప.365

---

1 షట్పద విభుపోల్కి. 2 విశ్వమంతయు. 3 గుణానువర్ణన.

10 క॥ శ్రీనాయక నీ నామము
నానాభవరోగ కర్మ • నాశమునకు వి
న్నాణంబగు నౌషధమిది
కానరు దుష్టాత్ములకట • కంజదళాక్షా॥ ఏ. ప. 17

11 క॥ శ్రీవనితాధిపునామ క
థావిముఖుల కిహము పరము • దవ్వై పిదపం
బోవుదురు నరకమునకు
న్నావిరి నే వారిఁ జూచి • వగతు మునీంద్రా॥ తృ॥ ప. 193

12 క॥ ఎఱిఁగినవారం బనుచును
గొఱమాలిన యెఱుకలెఱిఁగి • కొందఱు నీపే
రెఱిఁగియుఁ దలపఁగ నొల్లరు
పఱతు రధోగతుల జాడఁ • బద్మదళాక్షా॥ ద॥ ప. 94

13 క॥ మందునకు మందబుద్ధికి
మందాయువునకు నిరర్థ • మార్గములను గో
విందచరణారవింద మ
రందముగొనఁ దెలిపిలేదు • రాత్రిం బవలున్॥ ప్ర॥ ప. 394

14 మ॥ అమరు లృక్కసులుం బ్రయాస[1] బలహే • త్వర్థాభిమానంబుల
న్సములై లబ్ధ[2] వికల్పులైరి సురలు • న్సంశ్రేయసంయుక్తులై
రమరారు ల్బహు దుఃఖముం గనిరి తా • మత్యంత దోర్గర్వులై
కమలాక్షుస్మరణంబు వేఁడని జను • ల్గల్యాణ సంయుక్తులే? అ॥ ప. 326

15 క॥ దానవు లమృతముఁ ద్రావం
బూని పయోరాశిఁ ద్రిచ్చి • పొగిలినమాడ్కిన్
శ్రీనాథ పరాఙ్ముఖులగు
హీనులు వొందంగఁజాల • రిష్టార్థములన్॥ అ॥ ప. 327

16 క॥ పురుషుఁడు దవిలి చతుర్విధ
పురుషార్థ శ్రేయ మాత్మఁ • బొందెడ ననినన్
ధరఁ దత్ప్రాప్తికి హేతువు
హరిపదయుగళంబు దక్క • నన్యముగలదే? చ॥ ప. 245

---

1 బలహత్వార్థ 2 వికల్పులైరి యమరుల్

17 క॥ హరివార్త లెఱుఁగువారికి
హరిపదములు దలఁచువారి • కనవరతంబున్
హరికథలు వినెడువారికి
మరణాగతమోహ సంభ్ర • మము లే దనఘా! ప్ర॥ ప. 439

18 చ॥ వినుతగుణోత్తరుండు [1]సుర • విక్రముఁడైన హరిన్భజించి త
న్మనన లసత్కథామృతము • మానుగఁ గ్రోలుట మాని దుష్కథ
ల్విని ముదమందుచుందురు వి • వేకవిహీనత నూరపంది యా
త్మను మధు రాజ్యభక్ష్యములు • మాని పురీషము మెక్కఁ జాడ్పునన్॥
తృ॥ ప. 1022

19 క॥ సరసిరుహోదరు మంగళ
చరితామృత మాత్మఁ గ్రోలు • జనుఁ డితరకథా
గరళముఁ గ్రోలునె హరిసం
స్మరణము జీవులకు నఖిల • సౌఖ్యద మనఘా॥ తృ॥ ప. 192

20 తే॥ గీ॥ భూరి విజ్ఞాన విదులగు • నారదాది
నిర్మలాత్ములకయిన వ • ర్ణింపరాని
హరికథామృత పానంబు • నందు విసివి
యొల్ల ననువాఁడె పో వెఱ్ఱి • గొల్లఁ డనఘ! తృ॥ ప. 188

21 సీ॥ ఎవ్వని గుణజాల • మెన్న జిహ్వలు లేక
నళినగర్భాదు ల • నంతుఁ డండ్రు
గోరెదు విబుధేంద్ర • కోటినొల్లక లక్ష్మి
ప్రార్థించె నెవ్వని • పాదరజము
బ్రహ్మ యెవ్వని పాద • పద్మంబు గడిగిన
జలము ధన్యతఁ జేసె • జగము నెల్ల
భగవంతుఁ డని యెడి • భద్రశబ్దమునకు
నెవ్వ డర్థాకృతి • నేపు మిగిలె
తే॥ గీ॥ నే మహాత్ము నాశ్ర • యించి శరీరాది
సంగకోటి నెల్ల • సంహరించి

---

1 సురవిక్రముఁడున్నగునట్టి విష్ణుకీర్తన రుచిరామృతంబు ప్రమదంబున
2 రేఁగుచాడ్పునన్

ప్రాభవమున మునులు • పారమహంస్యంబు
నొంది తిరిగి రాక • యుందు రెలమి॥ ప్ర॥ ప. 451

22 క॥ అగు సర్వేశుఁ బరాత్పరు
జగదేకప్రభుని పాద • జలజాతంబు
ల్దగిలి భజింతురు సతతము
నిగమోక్తిస్థభక్తియోగ • నిపుణాత్మకులై॥ త్ర॥ ప. 221

23 క॥ చిత్రంబులు త్రైలోక్య ప
విత్రంబులు భవ లతాల • విత్రంబులు స
న్మిత్రంబులు మునిజన వన
చైత్రంబులు విష్ణుదేవు • చారిత్రంబుల్॥ స॥ ప. 6

24 సీ॥ సంతతంబును గృష్ణ • సంకీర్తనంబులు
వీనుల కింపు • గా వినగవలయు
[1] హరినామకథనంబు • హర్షంబుతో డుతఁ
బాటల నాటలఁ • బనుపవలయు
నారాయణుని దివ్య • నామాక్షరంబులు
హృద్వీధి సతతంబు • నెన్నవలయు
గంజాక్షు లీలలు • గాంతారములనైన
భక్తి యుక్తంబుగాఁ • బాడవలయు
తే॥ గీ॥ వెఱ్ఱిమాడ్కిని లీలతో • విశ్వమయుని
నోడువుచును లోకబాహ్యత • నొందవలయు
నింతయును విష్ణుమయ మ • ని యెఱుఁగవలయు
ఖేద మొనరింప వలవదు • మేదినీశ! ఏ॥ ప. 44

25 సీ॥ నారాయణుని దివ్య • నామాక్షరములపైఁ
గరుఁగని మనములు • గఠినశిలలు
మురవైరి కథలకు • ముదితాశ్రురోమాంచ
మిళితమై యుండని • మేను మొద్దు

1 హర్షంబులో డుత హరినామకథనంబు

చక్రికి మ్రొక్కని ♦ జడుని యాదల నున్న
కనక కిరీటంబు ♦ గట్టెమోపు
మాధవార్పితముగా ♦ మనని మానవు సిరి
వనదుర్గ చంద్రికా ♦ వైభవంబు
తే॥ గీ॥ కైటభారి భజన ♦ గలిగి యుండనివాఁడు
గాలిలోననుండి ♦ కదలు శవము
కమలనాభు పదముఁ ♦ గననివాని బ్రతుకు
బసిడికాయలోని ♦ ప్రాణి బ్రతుకు॥ ద్వి॥ ప. 51

26 సీ॥ ముక్తికాంతైకాంత ♦ మోహన కృత్యము
లేకలిమై హరినామ ♦ కీర్తనములు
సత్యలోకానంద ♦ సౌభాగ్యయుక్తము
లేకలిమై హరినామ ♦ కీర్తనములు
మహితనిర్వాణ సా♦మ్రాజ్యాభిషిక్తము
లేకలిమై హరినామ ♦ కీర్తనములు
బహుకాల జనిత త♦పఃఫలసారము
లేకలిమై హరినామ ♦ కీర్తనములు
తే॥ గీ॥ పుణ్యమూలంబు లనపాయ ♦ పోషకంబు
లభిమతార్థంబు లజ్ఞాన ♦ హరణకరము
లాగమాంతోప లబ్ధంబు ♦ లమృతసేవ
లార్తశుభములు హరినామ ♦ కీర్తనములు॥ ష॥ ప 119

27 సీ॥ విష్ణుకీర్తనములు ♦ వినని కర్ణంబులు
గొండల బిలములు ♦ గువలయేశ
చక్రిపద్యంబులు ♦ చదువని జిహ్వలు
గప్పల జిహ్వలు ♦ కౌరవేంద్ర
శ్రీమనోనాథు నీ♦క్షింపని కన్నులు
నేకి పింఛాక్షులు ♦ కీర్తిదయిత
కమలాక్షు పూజక♦గాని హస్తంబులు
శవము హస్తంబులు ♦ సత్యవచన

తే॥ గీ॥ హరిపద తులసీద • ళామోఁగరతిలేని
ముక్కు పందిముక్కు • మునిచరిత్ర
గరుడగమను భజన • గతిలేని పదములు
పాదపముల పాద•పటల మనఘ॥ ద్వి॥ ప 50

28 సీ॥ బ్రహ్మహత్యానేక • పాపాటవుల కగ్ని
కీలలు హరినామ • కీర్తనములు
గురుతల్పకల్మష • క్రూరసర్పములకుఁ
గేకులు హరినామ • కీర్తనములు
తపనీయచౌర్య సం•తమసంబునకు సూర్య
కిరణము హరినామ • కీర్తనములు
మధుపానకిల్బిష • మదనాగ సమితికి
గేసరులు హరినామ • కీర్తనములు
తే॥ గీ॥ మహితయోగోగ్రనిత్య స•మాధివిధుల
నలసి బ్రహ్మాది సురలకు • నందరాని
భూరినిర్వాణసామ్రాజ్య • భోగభాగ్య
ఖేలనంబులు హరినామ • కీర్తనములు॥ ష॥ ప 118

29 సీ॥ దూర్వాంకురంబుల • దూర్వాంకురశ్యాము
జలజంబులను జల•జాతనయనుఁ
దులసీదళంబులఁ • దులసీకోదాముని
మాల్యంబులను [1] విని•ర్మలచరిత్రు
బత్రంబులను బక్షి•పత్రునిఁ గడువన్య
మూలంబులను నాది•మూలు ఘనుని
సంచిత భూర్జత్వ • గాది నిర్మిత వివి
ధాంబరంబులను బీ•తాంబరధరుఁ
తే॥ గీ॥ దనరుభక్తిని మృచ్ఛిలా • దారు రచిత
రూపములయందుఁగాని ని•రూఢమైన
సలిలములయందుఁగాని సు•స్థలములందుఁ
గాని పూజింపవలయు న • క్కమలనాభు॥ చ॥ ప 255

(1) సునైర్మల్య చరిత్రు

30 సీ॥ కమలాక్షునర్చించు ♦ కరములు కరములు
శ్రీనాథువర్ణించు ♦ జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁజూచు ♦ చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు ♦ శిరము శిరము
విష్ణునాకర్ణించు ♦ వీనులు వీనులు
మధువైరి దవిలిన ♦ మనము మనము
భగవంతు వలగొను ♦ పదములు పదములు
పురుషోత్తమునిమీఁది ♦ బుద్ధి బుద్ధి
తే॥ గీ॥ దేవదేవునిఁ జింతించు ♦ దినము దినము
చక్రహస్తుని ప్రకటించు ♦ చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి ♦ గురుఁడు గురుఁడు
తండ్రి! హరిఁజేరుమనియెడి ♦ తండ్రి తండ్రి॥ స॥ ప 169

31 చ॥ హరిభజియించు హస్తములు ♦ హస్తము లచ్యుతుఁగోరి మ్రొక్కు త
చ్ఛిరము శిరంబు చక్రధరుఁ ♦ జేరిన చిత్తము చిత్త మిందిరా
వరుఁ గనుదృష్టి దృష్టి ముర ♦ వైరి నుతించిన వాణి వాణి య
క్షర కథలాను కర్ణములు ♦ కర్ణములై విలసిల్లుఁబో భువిన్॥
ద॥ ప 969

32 సీ॥ కంజాక్షునకుఁగాని ♦ కాయంబు కాయమే
పవనగుంఫిత చర్మ ♦ భస్త్రిగాక
వైకుంఠుఁ బొగడని ♦ వక్త్రంబు వక్త్రమే
ఢమఢమధ్వనితోడి ♦ ఢక్కగాక
హరిపూజనము లేని ♦ హస్తంబు హస్తమే
తరుశాఖనిర్మిత ♦ దర్విగాక
కమలేశుఁ జూడని ♦ కన్నులు కన్నులే
తనుకుడ్యజాల రం ♦ ధ్రములుగాక
తే॥ గీ॥ చక్రిచింత లేని ♦ జన్మంబు జన్మమే
తరల సలిల బుద్బు ♦ దంబుగాక
విష్ణుభక్తి లేని ♦ విబుధుండు విబుధుడే
పాదయుగముతోడి ♦ పశువుగాక॥ స॥ ప 17

33 సీ॥ అలరుజొంపములతో • నభ్రంకషంబులై
బ్రతుకవే వనముల • బాదపములు
ఖాదనమేహనా • కాంక్షల బశువులు
జీవింపవే గ్రామ • సీమలందు
నియతమై యుచ్ఛ్వాస • నిశ్వాస పవనము
ల్వ్రాపింపవే చర్మ • భస్త్రికలను
గ్రామసూకర శున • కశ్రేణు లింటింటఁ
దిరుగవే [1] దుర్భాగ్య • దీనవృత్తి
తే॥ గీ॥ సుప్తశిఖరములు మోయవే • యురుభరముల
పుండరీకాక్షు నెఱుఁగని • పురుషపశువు
లడవులందు నివాసము • లందు బ్రాణ
విషయభరయుక్తితోనుంట • విఫలమధిప! ద్వి. ప 49

34 క॥ మొత్తుదురు గదల మంటల
కెత్తుదు రడ్డంబు దేహ • మింతింతలుగా
నొత్తుదు రసిపత్రికలను
హత్తుదురు కృతాంతభటులు • హరి విరహితులన్॥ ద్వి॥ ప 25

35 సీ॥ మందార మకరంద • మాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే • మదనములకు
నిర్మల మందాకి•నీ వీచికలఁ దూఁగు
రాయంచ జనునె త•రంగిణులకు
లలితరసాల పల్లవఖాదియై చొక్కు
కోయిల సేరునే • కుటజములకుఁ
బూర్ణేందు చంద్రికా • స్ఫురిత చకోరక
మరుగునే సాంద్రనీ•హారములకు
తే॥ గీ॥ నంబుజోదరు దివ్యపా•దారవింద
చింతనామృతపాన వి•శేషమత్త
చిత్త మేరీతి నితరులఁ జేరనేర్చు?
వినుతగుణశీల! • మాటలు వేయునేల? స॥ ప 150

---

(1) దుర్భాగ్యదీనమగుచు

36 సీ॥ నీరదాగమమేఘ • నిర్యత్పయఃపాన
చాతకంబేగునే • చౌటిపడెకుఁ
బరిపక్వమాకంద • ఫలరసంబులు గ్రోలు
కీరముల్చనునె దు•త్తూరములను
ఘనరవాకర్ణనో • త్కలిక మయూరము
ల్గోరునే కఠినఖి•ల్లీరవంబుఁ
గరికుంభపిశిత స • ద్గ్రాస మోదిత సింహ
మరుగునే శునకమాం•సాభిలాషఁ

తే॥ గీ॥ బ్రవిమలాకార భవదీయ • పాదపద్మ
యుగ సమాశ్రయనైపుణో•ద్యోగచిత్త
మన్యుజేరునె తన కుపా•స్యంబుగాఁగ
భక్తమందార! దుర్భవ•భయవిదూర! దశ॥ ప 257

37 ఉ॥ కాన సరోజలోచను జ•గత్ స్తవనీయ కథాసుధారసం
బానిన యట్టి [1] జిహ్వ యన • దన్యకథాలవణోదకంబుల
న్వానము సేయఁ జూచునె సు•పక్వమహీజ మరంద [2] పానలా
భానుభవంబునొందు [3] మధు•పంబును బోవునె వేపచెట్లకుఁ॥
తృ॥ ప 443

38 క॥ విమలమతిఁ దలఁప నెవ్వని
బొమముడిమాత్రమున నిఖిల • భూదేవీ భా
రము వాయునట్టి హరిపద
కమల మరందంబుఁ గ్రోలు • ఘనుఁ డెవ్వాఁడో॥ తృ॥ ప 96

39 మ॥ ఘనలక్ష్మీయుతమై మహాశుభదమై • కామాది విధ్వంసిమై
సనకాదిస్తుతమై నిరంతర తప•స్సంతప్తపున్నాగ జీ
వనమై యొప్పెడు నీకథామృతము దా•వం గల్గనే భూరిదా
న నిరూఢత్వము లేనివారలకు మా•నారీమనోహారకా!
దశ॥ ప 1047

---

(1) జిహ్వాయితరాను (2) పానశోభా (3) మధుపప్రభుఁడేఁగునె

40 క॥ హరి భగవంతుఁ డనంతుఁడు
గుణాంబుధి సృష్టి కార్య • కారణ హేతు
స్ఫురణుం డవ్విభుకంటెం
బరుఁ డన్యుఁడు లేఁడు • తండ్రి పరికింపంగన్॥ ద్వి॥ ప 105

41 ఉ॥ కారణ కార్య హేతువగు • కంజదళాక్షునికంటె నన్య లె
వ్వారును లేరు తండ్రి భగ•వంతు ననంతుని విశ్వభావనో
దారుని సద్గుణావళు లు•దాత్తమతి న్గొనియాడకుండినన్
జేరవు చిత్తముల్ ప్రకృతిఁ • జెందని నిర్గుణమైన బ్రహ్మమున్॥
ద్వి॥ ప 213

42 చ॥ హరిపరమాత్ముఁ డీశుఁ డజుఁ•డాద్యుఁ డనంతుఁ డనంతమూర్తి సా
గర తనయాహృదీశుఁడు వి•కారవిదూరుఁడు నిత్యమంగళా
కరుఁడు కృపాపయోనిధి య•కల్మషచిత్తుఁడు సర్వశక్తిఁ దా
మరసవిలోచనుఁడు బుధ•మాన్యచరిత్ర పవిత్రుఁ డిమ్ములన్॥
తృ॥ ప 213

43 క॥ కావున పరాత్ముండు మ
హా విభవుఁడు విష్ణుఁడీశుఁ • డాకర్ణింప
న్సేవింప న్వర్ణింప
న్భావింపన్భాగ్యుఁ [1] డభవ • భాజికి నధిపా॥ ద్వి॥ ప 4

44 క॥ శశ్వత్ప్రశాంతు నభయుని
విశ్వాత్ముఁ బ్రబోధమాత్రు • విభుసంశుద్ధున్
శాశ్వతు సదసత్స్వాపుష
నీశ్వరుఁ జిత్తమున నిలుపు • మెపుడు మునీంద్రా! ద్వి॥ ప 209

45 క॥ నిరతిశయోజ్జ్వలతేజ
స్స్ఫురణన్దనరారు పరమ•పురుషుని విష్ణుం
బురుషోత్తము వర్ణింపను
సరసిజభవ భవులకైన • శక్యమె చెపుమా॥ తృ॥ ప 366

46 క॥ హరిమహిమము దన్నాభీ
సరసిజ సంజాతుఁడైన • చతురాననుఁడు

---

1 డుభయభాజికి

స్మరించి యెఱుఁగఁడనిన ని
తర మనుజులఁ జెప్పనేలఁ దత్త్వజ్ఞనిధీ! తృ॥ ప 225

47 తే॥ గీ॥ శ్రుతులు దమలోన వివరించి • చూచి పుండ
రీకలోచను నుత్తమ • శ్లోకచరితు
నమరగణవంద్యమాన పా•దాబ్జయుగళు
వెదకి గనుగొన లేవంద్రు • విమలమతులు॥ తృ॥ ప 226

48 క॥ ఆ దివిజాధీశుఁడు మహా
దాదులు దిక్పతులుఁ బంక•జాసనుఁడు న్గౌ
రీదయితుఁడు గనఁజాలని
శ్రీదేవుని పదయుగంబుఁ • జింతింతు మదిన్॥ తృ॥ ప 228

49 గీ॥ పరమునికి వందనము సేతుఁ • బరిఢవించి
మునునవితథానుభూతికి • మ్రొక్కికొందు
మెఱయ గుణములఁ దేలు ని•మిత్తమాత్ర
బంధుఁడై నట్టివానికిఁ • బ్రణుతి సేతు॥ ష॥ ప 218

50 ఉ॥ ఏపరమేశుచే జగము • లీ సచరాచరకోటితో సము
ద్దీపితమయ్యె నేవిభుని • దివ్యకళాంశజు లబ్జగర్భ గౌ
రీపతి ముఖ్యదేవముని•బృందము లెవ్వఁ డనంతుఁ డచ్యుతుం
డా పురుషోత్తముండు గరు•ణాంబుధి కృష్ణుడువో నరేశ్వరా॥
తృ॥ ప 30

51 మ॥ బలుఁడుం గృష్ణుఁడు మర్త్యులే వసుమతీ•భారంబు వారింప వా
రలరూపంబుల బుట్టినాఁడు హరి ని•ర్వాణప్రభుండిప్పు[1]డు
జ్వలుఁడై ప్రాణవియోగ కాలమునఁ ద•త్సర్వేశుఁ జింతించు వాఁ
డలఘుశ్రేయముఁ బొందు బ్రహ్మమయుఁడై • యర్థాభుఁడై నిత్యుడై॥
ద॥ ప 1450

52 సీ॥ కన్నులు దెఱవని • కడుచిన్ని పాపడై
దానవిఁ జనుబాలు • ద్రావి చంపె

(1) దెవ్వఁడుజ్వలుఁడై

మూఁడవ నెలనాఁడు • ముద్దులబాలుఁడై
కోపించి శకటంబుఁ • గూలఁదన్నె
నేడాది కుఱ్ఱఁడై • యెగసి తృణావర్తు
మెడఁబట్టుకొని కూల్చి • మృతునిఁజేసెఁ
దల్లి వెన్నలకునై • తను ఱోలఁగట్టినఁ
గోమరుఁడై ముద్దులఁ • గూల నీడ్చె

తే॥ గీ॥ బసులఁ గ్రేపులఁగాచుచు • బకునిఁజీరె
వెలఁగతో వత్సదైత్యుని • వ్రేసిచంపె
సబలుఁడై ఖరదైత్యుని • సంహరించె
నితఁడు కేవల మనుజుఁడే • యెంచిచూడ॥ ద॥ ప 932

53 క॥ తెంపరియై రాముని చేఁ
జంపించె ప్రలంబు మ్రింగె • జటుల దవాగ్ని
న్సొంపుచెడ ద్రొక్కె గాళియు
ద్రుంపక కాళింది వెడల • ద్రోలెఁ లీలన్॥ ద॥ ప 933

54 చ॥ సతతము కృష్ణపాద జల•జంబులయందు మనంబు నిల్పు సు
వ్రతులుఁ దదీయశుద్ధ గుణ•రాగులుఁ గాలునియుగ్రపాశ సం
హతుల ధరించు తత్సుభట • కోఘములం గలలోనఁ గానరే
గతులను దుష్టకర్మములు • గైకొని వారలఁ జెందనేర్చునే! వ॥ ప 58

55 ఉ॥ కూలినచోట గొట్టుపడి • కుందినచోట మహాజ్వరాదులం
జ్రేలినచోట సర్పముఖ•పీడల నందినచోట నార్తులై
తూలినచోట విష్ణుభవ•దూరుని జేర్కొనిరేని మీఁద న
క్కాలుని యాతనాతతి • గానరు పూనరు దుఃఖభావముల్! ష॥ ప 123

56 క॥ దానవదైత్య భుజంగమ
మానవగంధర్వ సుర స•మాజములో ల
క్ష్మీనాథు చరణకమల
ధ్యానంబున నెవ్వఁడైన • ధన్యతనొందున్॥ ష॥ ప 212

57 క॥ భూషణములు చెవులకు బుధ
తోషణము లనేకజన్మ • దురితౌఘవిని
శ్శోషణములు మంగళతర
ఘోషణములు గరుడగమను • గుణభాషణముల్॥

ద॥ ప 1687

58 క॥ రూపంబులు ఖండిత సం
తాపంబులు కల్మషాంధ • తమస మహోద్య
ద్దీపంబులు పాషండ దు
రాపంబులు విష్ణు వంద•నాలాపంబుల్। ప్ర॥ ప 445

59 క॥ పావనములు దురితలతా
లావనములు నిత్యమంగ•ళ ప్రాభవ సం
జీవనములు లక్ష్మీసం
భావనములు వాసుదేవ•పద సేవనముల్। ప్ర॥ ప 446

60 క॥ శ్రీపతి పదమను నావను
ప్రాపించు భవాబ్ధి వత్స•పదముగ ధీరు
లూపించి దాటి చేరుదు
రాపత్పదరహితులగుచు • నమృత పదంబున్॥ ద॥ ప 594

61 క॥ కాన భవత్పదపద్మ
ధ్యానంబునఁ గాని శాస్త్ర•తత్త్వంబులచేఁ
గానరు శ్రుతి సంవేద్యము
నైన భవత్పదము చిన్మ•యాకార హరీ॥ ద॥ ప 1150

62 గీ॥ జలజనాభ సకల•జగదంతరాత్మవై
నట్టి దేవ నీ ప•దారవింద
యుగళి సానురాగ•యుక్తమై నామది
గలుగునట్లుగాఁగ • దలఁపు మనఘ॥ ద॥ ప 260

63 సీ॥ మానితశ్యామకాయ • మానవశరీర ధీ
ధితులు నళ్లక్కుల • దీటుకొనఁగఁ
గాంచన మేఖలా•కాంతులతోఁ గా
శేయ చేలద్యుతు • లైలిమి సేయ

లక్ష్మీసమాయుక్త • లలిత వక్షంబున
వైజయంతీ ప్రభ • ల్వన్నెఁ జూప
హాటకరత్న కి•రీటకోటి ప్రభ
ల్బాలార్కరుచులతో • మేలమాడ
తే॥ గీ॥ లలిత నీలాభ్రరుచిఁ గుంత•లములు దనరఁ
బ్రవిమలాత్మీయ దేహజ • ప్రభసరోజ
భవభవామరముఖ్యుల • ప్రభలు మాప
నఖిలలోకైక గురుఁడు నా•రాయణుండు॥ చ॥ ప 163

64 చ॥ సలలిత శంఖచక్ర జల•జాతగదాశరచాపఖడ్గ ని
ర్మలరుచుల న్సువర్ణరుచి • మన్మణికంకణ ముద్రికా ప్రభా
వలులను దేజరిల్లు భుజ•వర్గ మనర్గళకాంతియుక్తమై
విలసిత కర్ణికార పృథి•వీరుహము స్ఫురణించు బిట్టుగన్॥
చ॥ ప 164

65 క॥ సరసోదార సమంచిత
పరహాస విలోకనములఁ • దగ లోకముల
స్పరితోషము నొందింపుచుఁ
బరమోత్సవమొప్ప విశ్వ•బంధుండగుచున్॥ చ॥ ప 165

66 మ॥ నరయును రాజహంసరుచి • మద్భ్రమణీకృత తాలవృంత [1]చా
మరములు వీవఁగా దివిజ•మానిను లచ్ఛను ధామరీచి [2]వి
స్ఫురణసితాతపత్ర రుచి•పుంజము దిక్కుల: బిక్కటిల్లఁగాఁ
గరవరదుండు వచ్చె సుభ•గస్తుతివర్ణ సుపర్ణయానుఁడై॥
చ॥ ప 166

67 చ। కమలదళాక్ష! నీవలనఁ•గల్గిన ధర్మము దావకావతా
రముల సురక్షితంబగుఁ ది•రంబగు నీశ్వర నిర్వికార త
త్త్వమునఁ దనర్చు నిన్నరయఁ • దత్ఫలరూపము తత్ప్రధాన గో
ప్యమునని పల్కుచుందురు కృ•పామయలోచన! పాపమోచనా!
తృ॥ ప 572

---

1 చామరలిచుదంకలన్. 2 విస్ఫురిత.

68 మ॥ సతతజ్ఞాన రమాయశోబల మహై•శ్వర్యాది యుక్తుఁ జగ
త్పతి యజ్ఞేశు ననంతు నచ్యుతు దళ•త్పంకేరుహాక్షుఁ శ్రియః
పతి నాద్యంతవికారదూరుఁ గరుణా•పాథోనిధిం సాత్వతాం
పతివర్ధిష్ణు సహిష్ణు విష్ణు గుణవి•భ్రాజిష్ణు రోచిష్ణునిన్॥
ద్వి॥ ప 238

69 సీ॥ అస్మత్ప్రియస్వామి • నచ్యుతుఁ బరసత్త్వ
గుణగరిష్ఠుని రజో•గుణ విహీను
సురుచిర ద్వారకా•పుర సమాశ్రయు ననా
శ్రయు నీలనీరద•శ్యామవర్ణు
దర దరవింద సుం•దరపత్రనేత్రు ల
క్ష్మీయుతుఁ బీతకౌ•శేయవాసు
విలసిత వామాంక • విన్యస్త దక్షిణ
చరణారవిందు శ•శ్వత్ప్రకాశు

తే॥ గీ॥ ఘన చతుర్బాహు సుందరా•కారు ధీరుఁ
జెన్నుగలలేత రావిపై • వెన్నుమోపి
యున్న వీరాసనాసీను • నన్నుఁగన్న
తండ్రి నానంద పరిపూర్ణు • దనుజహరుని॥ తృ॥ ప 146

70 మ॥ దరహాసామృత పూరితాస్యు నిజ భ•క్తత్రాణ పారాయణుం
గరుణాంభోరుహ పత్రలోచనుని [1]పీ•తాచ్ఛాదనుఁ లోకసుం
దరు మంజీరకిరీట కుండలముఖో•ద్యద్భూషు యోగీశ్వరే
శ్వరు లక్ష్మీయుత వక్షుఁ జిన్మయు దయా•సాంద్రుఁ జతుర్బా
హునిన్॥ ద్వి॥ ప 239

71 క॥ అనుపమగుణ సంపూర్ణుని
ననఘుని సుస్థితుని గతుని • నాసీను శయా
నుని భక్త హృద్గుహాశయ
నుని సర్వేశ్వరు ననంతు • నుత సచ్చరితున్॥ తృ॥ ప 926

72 క॥ అస్తోకచరితు నమిత స
మస్త సుధాహారు వేద•మస్తక తలవి

(1) పీతావాసుఁ ద్రైలోక్య సుందరు

న్యస్త పదాంబుజయుగళు న
పాస్తాశ్రిత నిఖిల పాపుఁ • బరము ననంతుఁ॥ ద॥ ప 628

73 సీ॥ నవ పద్మలోచను • భవబంధమోచను
భరిత శుభాకారుఁ • దురితదూరుఁ
గంకణకేయూరుఁ • గాంచన మంజీరు
వివిధ శోభితభూషు • విగతదోషు
బన్నగాంతకవాహు • భక్తమహోత్సాహు
నత చంద్రజూటు • నున్నత కిరీటు
హరినీలనిభకాయు • వరపీత కౌశేయుఁ
గటిసూత్రధారు • జగద్విహారు

తే॥ గీ॥ హార వనమాలికా మహి • తోరువక్షు
శంఖ చక్ర గదా పద్మ • శార్ఙ్గహస్తు
లలిత శ్రీవత్సశోభిత • లక్షణాంగు
సుభగచారిత్రు దేవకీ • సుతుని గాంచి॥ ద॥ ప 747

74 సీ॥ శంపాలతికతోడి • జలదంబు క్రైవడి
మెఱుఁగు టొల్లియతోడి • మేనివాని
గమనీయ మృదులాన్న • కబళ వేత్రవిషాణ
వేణుచిహ్నంబుల • వెలయువాని
గుంజావినిర్మిత • కుండలంబులవాని
శిఖిపింఛ వేష్టిత • శిరమువాని
వన పుష్పమాలికా • వ్రాతకంఠమువాని
నళిన కోమల చరణములవానిఁ

తే॥ గీ॥ గరుణ గడలు కొనిన • కడకంటివాని గో
పాలబాలు భంగిఁ • బరఁగువాని
నగుమొగంబువాని • నను గన్నతండ్రిని
నిను భజింతు మ్రొక్కి • నీరజాక్ష! ద॥ ప 549

75 ఉ॥ హారికి నందగోకుల వి • హారికిఁ జక్రసమీరదైత్య సం
హారికి భక్తదుఃఖ పరి • హారికి గోపనితంబినీ మనో

హారికి దుష్టసంప దప•హారికి ఘోషకుటీ పయోఘృతా
హారికి బాలకగ్రహ మ•హాసుర దుర్వనితాప్రహారికిన్॥

ప్ర॥ ప 29

76 ఉ॥ శీలికి నీతిశాలికి వ•శీకృత శూలికి బాణహస్త ని
ర్మూలికి ఘోరనీరద వి•ముక్త శిలాహత గోపగోపికా
పాలికి వర్ణధర్మ పరి•పాలికి నర్జున భూజయుగ్మసం
చాలికి మాలికిన్ విపుల • చక్రనిరుద్ధ మరీచిమాలికిన్॥

పరి॥ ప 30

77 ఉ॥ కుంతకు గాళియోరగ వి•శాలఫణావళి నర్తనక్రియా
రంతకు నుల్లసన్మగధ•రాజ చతుర్విధ ఘోరవాహినీ
హంతకు నింద్రనందన ని•యంతకు సర్వచరాచరావళీ
మంతకు నిర్జితేంద్రియ స•మంచిత భక్తజనానుగంతకున్॥

పరి॥ ప 31

78 ఉ॥ న్యాయికి భూసురేంద్ర మృత • నందనదాయికి రుక్మిణీ మన
స్థ్సాయికి భూతసమ్మద విధాయికి • సాధుజనానురాగ సం
ధాయికి పీతవస్త్రపరి•ధాయికి పద్మభవాండభాండ ని
ర్మాయికి గోపికా నివహ • మందిరయాయికి శేషశాయికిన్॥

పరి॥ ప 32

79 క॥ ముందఱనిల్చి ముకుంద స
నందన మునివినుత నంద•నందన పరమా
నంద శరదిందు చందన
కుందయశస్సాంద్ర కృష్ణ • గోవింద హరీ॥ ద॥ ప 1296

80 మ॥ జ్వరితార్తుండగు రోగి కౌషధమతీ • ష్టంబైన చందంబునన్
ధరలో నాతపతప్తదేహి గను శీ•తంబైన తోయంబునుం
గరిమం గ్రోలిన రీతి నెంతయు నహం•కారాహి దష్టుండనై
పరఁగు న్నాకును నీకథామృతము ద•ప్పన్ మందు వేఱున్నదే?

పం॥ ప 155

81 ఉ॥ కన్నులు లేనివాఁడు మఱి • కాననివానికిఁ ద్రోవఁజూపఁగాఁ
జన్న తెఱంగు మూఢున క•సన్మతిఁ దా గురుఁడౌట సూర్యుఁడే

కన్నులుగాఁగ భూతములఁ • గాంచుచునుండు రమేశ! మాఁకును
దృశ్యయమూర్తివై గుణస • హైయుల సద్గతిజాడఁ జూపవే!
భా॥ ప 729

82 క॥ మదిఁ దలపోయఁగ జల బు
ద్బుదములు ధరఁ బుట్టిపోవు • పోలికఁ గల యీ
త్రిదశాది దేహములలో
వదలక వర్తించు నాత్మ • వర్గము లోలిన్॥ న. ప 1224

83 ఆ॥ వె॥ ప్రళయవేళ నీవు • భరియింతు వంతయుఁ
గారణంబ వగుట • గమలనాథ
భక్తపారిజాత • భవభూరి తిమిర ది
నేశ! దుష్టదైత్య • నాశ! కృష్ణ! ద॥ ప 1225

84 క॥ తరణంబులు భవజలధికి
హరణంబులు దురితలతల • కాగమముల కా
భరణంబు లార్తజనులకు
శరణంబులు నీ [1] పదాబ్జ • సేవా నిరతుల్॥ ఏ॥ ప 15

85 క॥ నీపేరు వినిన నొడివిన
బాపంబులు [2] మాసిపోవుఁ • బద్మాక్ష జగ
ద్దీపక నీదర్శనమున
నేపారదె భక్తజనుల • కిహపర సుఖముల్ ద॥ ప 662

86 క॥ తారా తుషారశీకర
భూరజములకైన లెక్క • బుధు లిడుదురు భూ
భారావతీర్ణ కరుఁడగు
నీరమ్యగుణంబు లెన్న • నేర రగణ్యా! ద॥ ప 555

87 క॥ వాసవవందితభవ కమ
లాసన దివ్యప్రభావ • భావిని యెపుడున్
నీ సమధికచారిత్ర క
థాసురుచిర గాన మవిత • థంబై చెల్లున్॥ ద॥ ప 258

---

(1) నీదు దివ్యచరణంబులిలన్ (2) దూరి

88 క॥ జిష్ణు నిశాటవిపాటన
వృష్ణికులాంభోజ సూర్య • విప్రామరగో
వైష్ణవసాగర హిమకర
కృష్ణా! పాషండధర్మ•గృహదావాగ్నీ! ద॥ ప 580

89 ఉ॥ నీవిభవంబు లీజగము • నిండుట యుండుట నాశమొందుట
ల్నీ విమలాంశ జాలములు • నెమ్మి జగంబు సృజించువార లో
దేవ! భవద్గుణాంబుధుల • తీరముఁ గానకి యీశ బుద్ధితో
వావిరి జర్చ సేయుదురు • వారికి వారలు దొడ్డవారలై॥
ష॥ ప 473

90 మ॥ నినుఁ జింతింపుచుఁ బాడుచుఁ బొగడుచు • న్నీదివ్యచారిత్రము
ల్వినుచుం జాతురుగాక లోకు లితరా • న్వేషంబులం జాతురే
ఘన దుర్జన్మపరంపరా [1]హారణ దక్షంబై మహాయోగి వా
గ్వినుతంబైన భవత్పదాబ్జయుగము • న్విశ్వేశ! విశ్వంభరా!
ప్ర॥ ప 197

91 క॥ నీనామస్తుతి శ్వపచుం
డైనను జిహ్వాగ్రమందు • ననుసంధింప
న్వానికిసరి భూసురుఁడు
న్గానేరఁడు చిత్రమది జగంబుల నరయన్॥ తృ॥ ప 1037

92 క॥ పురుషోత్తమ నీపదసర
సిరుహము మననామృతాభి•షేక స్ఫురణ
న్గరమొప్పిన నాచిత్త మి
తరవస్తువులందు వాంఛఁ • దగులునె యెందున్॥ తృ॥ ప 152

93 క॥ పురుషుం డాద్యుఁడు ప్రకృతికిఁ
బరుఁ డవ్యయుఁ డఖిలభూత • బహిరంత ర్భా
సురుఁడును లోకనియంతుఁడు
బరమేశ్వరుఁడైన నీకుఁ • బ్రణతులగు హరీ! ప్ర॥ ప 186

94 క॥ నీపంపు సేయకుండగ
నాపద్మభవాదిసురల • కైనను వశమే

(1) దళన

శ్రీపతి! శరణాగతులం
జేపట్టి నిరోధ ముడుగఁ • జేయుము కృష్ణా! ద॥ ప 651

95 ఆ॥ వె॥ కృష్ణ వాసుదేవ • కేశవ పరమాత్మ
యప్రమేయ వరద • హరి ముకుంద
నిన్నుఁ జూడగంటి • నీకృపఁ గనుగొంటి
నఖలసౌఖ్యపదవు • లందగంటి॥ ద॥ ప 477

96 క॥ హవరూపివి హవనేతవు
హవభోక్తవు నిఖిల హవఫలాధారుఁడవుర్
హవరక్షకుండ వగు నీ
కవితతముగ నుతులొనర్తు • మయ్య ముకుందా! తృ॥ ప 427

97 సీ॥ ఇందీవరశ్యాము • వందిత సుత్రాముఁ
గరుణాలవాలు భాసురకపోలుఁ
గౌస్తుభాలంకారుఁ • గామితమందారు
సురుచిరలావణ్యు • సురశరణ్యు
హర్యక్షసిభగమధ్యు • నఖిలలోకారాధ్యు
ఘనచక్రహస్తు జగత్ప్రశస్తు
ఖగకులాధిపయాను • గాశేయపరిధానుఁ
బన్నగశయను నబ్జాత నయను

తే॥ గీ॥ మకరకుండల సద్భాషు • మంజుభాషు
నిరుపమాకారు దుగ్ధసాగరవిహారు
భూరిగుణసాంద్రు యదుకులాంభోధిచంద్రు
విష్ణు రోచిష్ణు జిష్ణు సహిష్ణుఁ గృష్ణు॥ ద॥ ప 979

98 సీ॥ ఆశ్రిత సత్ప్రసా • దాభిముఖుండును
(1) స్నిగ్ధప్రసన్నాన • నేక్షణుండు
సురుచిరవాసుండు • సుభ్రూయుగుండును
సుకపోలతలుఁడును • సుందరుండు
హారి నీలసంశోభి • తాంగుండుఁ దరుణుండు
నరుణావలోకనో • ష్ఠాధరుండుఁ

(1) నిగ్ధ

గరుణాసముద్రుండుఁ • బురుషార్థనిధియును
బ్రణతాశ్రియుండు శో•భనకరుండు
తే॥ గీ॥ లలిత శ్రీవత్సలక్షణ • లక్షితుండు
సర్వలోకశరణ్యుండు • సర్వసాక్షి
పురుషలక్షణ యుక్తుండుఁ • బుణ్యశాలి
యసిత మేఘనిభ శ్యాముఁ • డవ్యయుండు॥ చ॥ ప 250

99 సీ॥ సజల నీలాంబుద•శ్యామాయమానాంగు
నాశ్రితావన ముది•తాంతరంగు
సనకాదియోగి హృ•ద్వనజమరాళేంద్రు
ముఖపద్మరుచి జిత•పూర్ణచంద్రు
గమనీయ నిఖిల జ•గద్ధిత చారిత్రుఁ
బ్రీత్యాప్తసంఫుల్ల • పద్మనేత్రు
నిందిరాహృదయాగ•విందారుణోల్లాసు
శ్రీకరపీతకౌ•శేయవాసు
తే॥ గీ॥ హార కుండల కటక కే•యూర మకుట
కంకణాంగద మణి ముద్రి•కా వినూత్న
రత్ననూపుర కాంచీ వి•రాజమాను
భవమహార్ణవశోషు స•ద్భక్తపోషు॥ ద॥ ప 1312

100 సీ॥ ఘనమేరుశృంగ సం•[1]గతమైన మేఘంబు
నెఱి గరుడస్కంధ • నివసితుండు
గమనీయ నిజదేహ • కాంతివిపాటితా
ఖిలాఖిలాశాంత•రాళతముఁడు
సువిహితాష్టాయుధ • సుమనోమునీశ్వర
సేవక పరిజన•సేవితుండు
మండితకాంచన • కుండల రుచిరోప
లాలిత వదనక•పోలతలుఁడు
తే॥ గీ॥ చారునవరత్న దివ్యకో•టీరధరుఁడు
కౌస్తుభప్రవిలంబ మం•గళగళుండు

(1) సంగతిలి

లలితపీతాంబర ప్రభాలంకృతుండు
హారకేయూర వలయ మంజీరయుతుండు॥ చ॥ ప 902

101 క॥ లలితాయతాష్ట భుజమం
డల మధ్యస్ఫురితరుచి విడంబిత లక్ష్మీ
లలనా కాంతిస్ఫూర్తి
కలిత లసద్వైజయంతికా శోభితుఁడున్॥ చ॥ ప 903

102 సీ॥ హారకిరీట కేయూర కంకణ ఘన
భూషితుం డాశ్రితపోషణుండు
లాలిత కాంచీ కలాప శోభిత కటి
మండలుం డంచిత కుండలుండు
మహనీయ కౌస్తుభమణి ఘృణి చారు గ్రై
వేయకుం డానందదాయకుండు
సలలిత ఘనశంఖ చక్ర గదా పద్మ
హస్తుండు భువనప్రశస్తుఁ డజుఁడు
తే॥ గీ॥ గంధసౌరభ వనమాలికాధరుండు
హతవిమోహుండు నవ్యపీతాంబరుండు
లలిత కాంచన నూపురాలంకృతుండు
నిరతిశయ సద్గుణుఁడు దర్శనీయతముఁడు॥ చ॥ ప 252

103 క॥ సరసమనోనయన సము
త్కరుఁడు సుహృత్పద్మకర్ణికా నివసిత వి
స్ఫురదురు నఖమణిశోభిత
చరణసరోజాతుఁ డతుల శాంతుఁడు ఘనుఁడున్॥ చ॥ ప 253

104 సీ॥ అవ్యయుం డనఘుఁ డనంతశక్తినిఁ బరు
లైనట్టి బ్రహ్మరుద్రామరేంద్ర
వరుల కీశ్వరుఁడైన వాని సర్వాత్మకు
జ్ఞానస్వరూపు సమానరహితు
వరదుని జగదుద్భవస్థితి సంహార
హేతుభూతుని హృషీకేశు నభవు

బ్రహ్మచిహ్నంబులై • పరఁగు సుజ్ఞానశ
క్త్యాదుల నొప్పు బ్రహ్మంబు నీవు
తే॥ గీ॥ నజు షడూర్మిరహితు • నిజయోగమాయా వి
మోహితాఖిలాత్మ • ముఖ్యచరితు
మహితతేజు నాదిమధ్యాంతహీనుని
జిన్మయాత్ము నిను భజింతుఁ గృష్ణ! ద॥ ప 429

105 సీ॥ దరదరవింద సుందరపత్రరుచిరాక్షు
సలలిత శ్రీవత్సకలితవక్షు
నీలనీరద నీల • నీలోత్పలశ్యాము
నలినలాకలమాలికాభిరాము
[1]గౌస్తుభకలిత ముక్తావళియుతకంఠు
యోగిమానస పంకజోపకంఠు
సతత ప్రసన్న సస్మితవదనాంభోజు
దినకరకోటి సందీప్తతేజు
తే॥ గీ॥ సలలితానర్ఘ్య రత్నకుండలకిరీట
హారకంకణ కటకకేయూర ముద్రి
కాతులాకోటిభూషు భక్తప్రపోషు
గింకిణీయుత మేఖలాకీర్ణజఘను! తృ॥ ప 922

106 సీ॥ కంజాతకింజల్క • [2]పుంజరంజిత పీత
కౌశేయవాసు జగన్నివాసు
శత్రుభీకర చక్రశంఖగదాపద్మ
విహిత చతుర్బాహు • విగతమోహు
నుత భక్తలోక మనోనేత్ర వర్ధిష్ణు
లాలిత సద్గుణాలంకరిష్ణు
వరకుమారక వయఃపరిపాకు సుశ్లోకు
సుందరాకారు యశోవిహారు

(1) గౌస్తుభధరు చిరు (2) పుంజవర్ణుడు చి

తే॥ గీ॥ సకలలోక నమస్కృత • చరణకమలు
భక్తలోక పరిగ్రహ • ప్రకటశీలు
దర్శనీయ మనోరథ • దాయి గీర్త
నీయ తీర్థయశోమహ•నీయమూర్తి॥ తృ॥ ప 924

107 మ॥ నిను బ్రహ్మాదులెఱుంగలేరు జడతా•నిష్ఠుండ లోకత్రయా
వనదుర్మానగరిష్ఠుఁడ న్విపుల దు•ర్వైదుష్య భూయిష్ఠుఁడ
న్వినయ త్యాగ [1]కనిష్ఠుఁడ న్సుజన గ•ర్వశ్రేష్ఠుఁడ న్దేవ నీ
ఘనలీలావిభవంబు పెంపుఁదెలియం•గా నెవ్వఁడన్సర్వగా॥
ద। ప 945

108 శా॥ శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! • శృంగార రత్నాకరా!
లోకద్రోహినరేంద్రవంశ దహనా! • లోకేశ్వరా! దేవతా
నీకబ్రాహ్మణ గోగణార్తిహరణా! • నిర్వాణ సంధాయకా!
నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలత•ల్నిత్యానుకంపానిధీ!
ప్ర॥ ప 200

109 సీ॥ తరణిసుధాకర • [2]కిరణోదరాంచిత
సరసీరుహోత్పల • స్రగ్విలాసుఁ
గంకణనూపుర • గ్రైవేయ ముద్రికా
హార కుండల కిరీ•టాభిరాముఁ
గమనీయ సా • గర కన్యకా కౌస్తుభ
మణిభూషణోద్భాస • మానవక్షు
సలలిత దరహాస • చంద్రికా ధవళిత
చారు దర్పణ వీరా•జత్కపోలు
తే॥ గీ॥ శంఖచక్రగదా పద్మ • చారుహస్తు
నళికులాలకరుచి భాస్వ•దలికఫలకుఁ
పీతకౌశేయవాసుఁ గృ•పాతరంగి
తస్మితేక్షణుఁ బంకజో•దరుని హరుని। తృ॥ ప 751

110 వ॥ మఱియు శబ్దబ్రహ్మశరీరవంతుండు, సదాత్మకుండు, జ్ఞానైకవేద్యుండు, వైనతేయాంసవిన్యస్తచరణారవిందుండు నైన గోవిం

1 గరిష్ఠుఁడన్. 2 కిరణసమంచిత

దునిం గనుంగొని సంజాతహర్షల హరిబరవశుండు ఉబ్ధవునోరథుండు
నగుచు సాష్టాంగ దండప్రణామంబు లాచరించి తదనంతరంబ.

తృ॥ 752

111 క॥ ముకుళిత కరకమలుండై
యకుటిల సద్భక్తిఁ బరవశాత్మకుఁడగుచు
న్వికచాంభోరుహ లోచను
నకు నిట్లనియెం దదాననము గనుఁగొనుచున్॥ తృ॥ ప 753

112 శా॥ దేవా! నీచరణ ప్రసాదకణ లబ్ధింగాక లేకున్న నేం
డేవెంటన్ జనునీ మహామహిమ నూహింపంగ నెవ్వానికిన్
నీవారై చనువారిలో నొకఁటనై నిన్గొల్చు భాగ్యంబు నా
కీవే యిప్పటి జన్మమందయిన నేం డెందైనను న్నీశ్వరా!

ద॥ ప 570

113 చ॥ కమలదళాక్ష దుఃఖ లయ కారణమై తగు తావకీన రూ
పము ననివార్య దుర్భర విపద్దశ దుఃఖము నొందు మాకు నీ
సుమహిత సత్కృపాగరిమ జూపుటకంటె ననుగ్రహంబు లో
కమునఁ దలంప నొండొకటి గల్గునె భక్త ఫలప్రదాయకా॥

చ॥ ప 922

114 ఉ॥ ఏవిభు పాదపద్మరతు లెన్నడు నెవ్వరు బొందలేని పెం
దోప్రఁ జరింతు రట్టి బుధతోషక నీవరుదెంచుట న్బ్రమో
దావృతమయ్యెఁ జిత్తము కృతార్థతనొందె మనోరథంబు నీ
సేవఁ బవిత్రభావమును జెందె శరీరము నేఁడు మాధవా!

ద॥ ప 958

115 క॥ నీ నగవులు నీచూడ్కులు
నీ నానావిహరణములు నీ ధ్యానంబు
ల్నీ నర్మాలాపంబులు
మానసమున నాఁటి నేఁడు మఱుగదు కృష్ణా॥ ద॥ ప 1048

116 ఆ॥ వె॥ అంధకారవైరి యపరాద్రి కవ్వల
జనిన నంధమైన జగముభంగి

నిన్ను గానకున్న • నీరజలోచన
యంధతమస సమతుల • నగుదు నయ్య॥ ప్ర॥ ప 254

117 ఆ॥ వె॥ చరణసేవకులకు • సంసారభయమును
బాపి శ్రీకరంబు • పట్టుగలిగి
కామదాయియైన • కరసరోజంబు మా
మస్తకముల నునిచి • మనుపు మీశ! ద॥ ప 1043

118 చ॥ నగుమొగము న్సుమధ్యమును • నల్లనిదేహము లచ్చి కాటప
ట్టగు నురము న్మహాభుజము • లంచిత కుండలకర్ణముల్ మదే
భగతియు నీలవేణియుఁ గృ • పారసదృష్టియుఁ గల్గు వెన్నుఁడి
మ్మగఁ బొడసూపుఁ గాత కను • మూసినయప్పుడు విచ్చినప్పుడున్॥
న॥ ప 734

119 శా॥ శ్రీవత్సాంకిత కౌస్తుభస్ఫురిత ల • క్ష్మీ చారు వక్షస్థల
శ్రీవిభ్రాజితు నీలవర్ణు శుభరా • జీవాక్షుఁ గంజాత భూ
దేవేంద్రాది సమస్తదేవ మకుటో • ద్దీప్తోరు రత్నప్రభా
వ్యావిద్ధాంఘ్రిసరోజు నచ్యుతుఁ గృపా • వాసుం బ్రశంసించెదన్॥
ష॥ ప 1

120 తే॥ గీ॥ అరయ బ్రహ్మాదులెవ్వని • ననునయించి
భక్తియుక్తుల మనమునఁ • బ్రస్తుతింతు
రని నెవ్వని తలమీఁద • నావగింజఁ
బోలు నావేయుశిరముల • భోగిగొల్తు॥ ష॥ ప 477

121 సీ॥ ఓలిమై యెవ్వని • లీలావినోదము
ల్జన్మసంరక్షణ • క్షయములకును
హేతువులగుచుండు నెవ్వనిచూపుల
జనియించె సత్వర • జస్తమంబు
లెవ్వనిరూపంబు • లేకమై బహువిధం
బులను జగత్తులఁ • బ్రోచుచుండు
నెవ్వనినామంబు • లెఱుఁగక తలఁచిన
యంతన దురితంబు • లడఁగుచుండు

తే॥ గీ॥ నట్టి సంకర్షణాఖ్యుండు నవ్యయుండు
నైన శేషుని వినుతి సేయంగఁ దరమె
తలఁప నెవ్వఁడు వాఙ్మనంబులకు నింక
మూఁడులోకంబులందును భూతతతికి॥ పం॥ ప 124

122 ఆ॥ వె॥ పటియు బెక్కుగతుల మాబోఁటివారలఁ
బ్రోవఁ దలఁచి శేషమూర్తి సాత్త్వి
క స్వభావమొందెఁ గడఁకతో నట్టి శే
షునకు మ్రొక్కుచుందు ననుదినంబు॥ పం॥ ప 125

123 మ॥ ప్రళయాంభోనిధిలోన మేన్మఱచి నిద్రంజెందు వాణీశు మో
ముల వేదంబులు గొన్న దైత్యుని మృతిం బొందించి సత్యవ్రతుం
డలరన్ బ్రహ్మము మాటఁ దా నిలిపె సంగ్రాహ్యార్థుఁడై మీనమై
జలధిం గ్రుంకుచుఁ దేలుచున్ మెలఁగు రాజన్మూర్తికిన్ మ్రొక్కెదన్॥
అ॥ ప 745

124 సీ॥ దేవ జితం జితం తే పరమేశ్వర
జిత యజ్ఞభావన శ్రుతిశరీర
కారణసూకరా కారుండవగు నీకు
నతిభక్తి మ్రొక్కెద నయ్య వరద
భవదీయ రోమకూపములందు లీనంబు
లయ్యుండు నంబుధు లట్టియధ్వ
రాత్మకమై తనరారు నీరూపంబు
గానంగరాదు దుష్కర్మపరుల

తే॥ గీ॥ కట్టి నీకుఁ బ్రణామంబు లాచరింతు
నఖిల జగదేక కీర్తిదయానువర్తి
భవ్యచారిత్ర పంకజపత్రనేత్ర
చిరశుభాకార యిందిరాచిత్తచోర! తృ॥ ప 423

125 మ॥ చతురామ్నాయ వపుర్విశేషధర చంచత్సూకరాకార నీ
సితదంష్ట్రాగ్ర విలగ్నమైన ధర రాజిల్లె న్గులాద్రీంద్ర రా

జతశృంగోపరిలగ్న మేఘముగతిం • జాలందగె న్సజ్జనాం
చితహృత్పల్వల [1]లోల భూరమణ లక్ష్మీనాథ దేవోత్తమా!
తృ॥ ప 431

126 చ॥ సలలిత వేదశాస్త్రమయ • సాకరమూర్తిఁ బరర్చుచుఁ రసా
తలమునుండి వెల్వడు సుధారత మేను విదిర్పఁ దత్సటో
[2]చ్ఛలితములైన బిందువుల • సాధుతపోజన సత్యలోకవా
సులమగు మేము దోఁగి పరిశుద్ధి వహించితిమయ్య మాధవా!
తృ॥ ప 436

127 క॥ ఘోటకవదనుఁడవై మధు
కైటభులం ద్రుంచి నిగమ • గణములనెల్లం
బాటించి యజునకిచ్చిన
కూటస్థుఁడ వీశ్వరుఁడవు • కోవిదవంద్యా! స॥ ప 361

128 క॥ రక్షింపుము రక్షింపుము
పేక్షింపక యమిత నిఖిల • బృందారక ఘో
రక్షణదాచర విపనిట
లాక్ష భయాతురుల మమ్ము • నరయు మనంతా! ద॥ ప 592

129 క॥ నీమహిమ లెఱిఁగి పొగడఁగ
నే మెంతటివార మఖిల • నేత్రవు ద్విజగ
క్షేమంకరుఁడవు సుమతివి
తామసులము మమ్ముఁ గావఁ • దగు హలపాణీ! ద॥ ప 590

130 క॥ ఏమిపుడు సేయు సంస్తుతి
నీమహిమ నెఱింగి కాదు • నిరతము పెద్దల్
దామెది యుపదేశించిరో
యామతమునఁ బ్రస్తుతింతు • మయ్య మహాత్మా!
పం॥ ప 46

131 మ॥ మను బద్మాసన ధూర్జటి ప్రముఖ ధీమంతుల్తపోజ్ఞాన స
త్వనిరూఢిం దగు వారు నీమహిమముం • వర్ణింపఁ బారంబెఱుం

(1) లోలంబోపేద (2) చ్ఛలితవాంబు బిందువులు సాధుజనస్తు ...

గనివారయ్యాసు నోపి సంత వినుతుల్ • గాంచింతు రట్లాట నే
మఃను నిన్నర్థి నుతింతుమీశ వరదా • [1]బుద్ధ్యాదిమూలంబుగన్!
చ॥ ప 935

132 ఉ॥ వారిజనాభ భక్తజన • వత్సల దుష్టనుదాసురేంద్ర సం
హార సరోరుహానన పు•రారి ముఖామరవంద్యపాద పం
కేరుహ సర్వలోకపరి•కీర్తిత దివ్యమహాప్రభావసం
సార విదూర నందతను•జాత రమాహృదయేశ మాధవా!
ద॥ ప 647

133 ఉ॥ నీవు యశోదబిడ్డఁడవె • నీరజనేత్ర సమస్త జంతుచే
తోవిదితాత్మ ఈశుఁడవు • తొల్లి విరించి దలంచి లోకర
క్షావిధ మాచరింపుమని • సన్నుతిచేయఁగ [2]సత్కులంబున
న్భూ[3]వలయంబుఁగావ నిటు • పుట్టితిగాదె మనోహరాకృతిన్!
ద॥ ప 1042

134 కం॥ కంజదళలోచన దానవ
భంజనయోగీంద్ర విమల • భావన సద్బో
ధాంజన దృష్టి నిర్మల
రంజిత శుభమూర్తి కృష్ణ • [4]రామా వరదా. ద॥ ప 643

135 తే॥ గీ॥ అవ్యయుండవనంతుండ • వచ్యుతుండ
వాదిమధ్యాంత శూన్యుండ • వఖిల ధృతివి
నిఖిలమందెల్ల వర్తింతు • నీవు దగిలి
నిఖిల మెల్లను నీయందు • నెగడు కృష్ణా! ద॥ ప 442

136 కం॥ నారాయణ దామోదర
నీరజదళనేత్ర చక్రి • నిఖిలేశ గదా
ధారణ గోవింద నమ
స్కారము యదుపుత్ర నిత్య•కల్యాణహరీ! ద॥ ప 49

137 తే॥ గీ॥ కృష్ణ పరమాత్మ యదుకుల•క్షీరవార్ధి
పూర్ణచంద్రమ దేవకీ•పుత్ర సుజన

(1) బుద్ధ్యాద్యనుసారంబుగన్ (2) మత్కులంబు (3) వలయంబునం గరుణ
(4) రాజీవాక్షా

వినుత నారాయణాద్యుత • వేదవేద్య
భక్తజనపోష పరితోష • పరమపురుష! ద॥ ప 1187

138 సీ॥ కేశవ సంతత• క్లేశ నాశనుఁడవు
[1]గురు సన్మనోవాగ•గోచరుఁడవు
విస్మనసోరథ • హేతు [2]భూతోదార
గుణధాముఁడవు సత్త్వ•గుణుఁడ వఖిల
విశ్వసృష్టిస్థితి • విలయార్థధృత [3]నిత్య
విపుల మాయాగుణ • విగ్రహుఁడవు
మహితాఖిలేంద్రియ • మార్గ నిరధిగత
మార్గుఁడ వతిశాంత • మానసుఁడవు
తే॥ గీ॥ తవిలి సంసార [4]హారి మే•ధస్కుఁడవును
దేవదేవుఁడవును వాసు•దేవుఁడవును
సర్వభూతనివాసివి • సర్వసాక్షి
వైన నీకు నమస్కార•మయ్య కృష్ణ! చ॥ ప 918

139 ఆ॥ వె॥ పరిది పద్మనాభ • హరి కృష్ణ గోవింద
దాస దుఃఖనాశ • వాసుదేవ
యవ్యయాప్రమేయ • యనిశంబు గావింతు
మిందిరేశ నీకు • వందనములు॥ ద॥ ప 749

140 క॥ శ్రీపతియును యజ్ఞపతియుఁ బ్ర
జాపతియును బుద్ధిపతియు • జగదధిపతియున్
భూపతియు యాదవశ్రే
ణీపతియుం గతియునైన • నిపుణు భజింతున్॥ ద్వి॥ ప 65

141 చ॥ వనరుహ పత్త్రలోచన భ•వత్సఖుఁడైన సుధాంశు మౌళితో
డి నిమిషమాత్రసంగతి గ•డింది వ్రణంబును దుశ్చికిత్స్యమా

(1) గోరి మనోవాద (2) భూతాధార (3) ధారిత (4) హారణచేత
స్కుఁడవు.

ననుభవ కష్టరోగమున • కర్మిలి వైద్యుడవైన నిన్ను నే
మనయముఁ జూడఁగంటిమి కృ•తార్థులమై తగమంటి మీశ్వరా!
చ॥ ప 933

142 క॥ పరిపూర్ణుఁడవై యుండియు
మఱువక మాపూజ లెల్ల • మన్నింతువు నీ
చరణారవింద సేవయు
ధరఁ బెద్దలు వినిచినటులఁ • దగఁ జేసెదమా॥ పం॥ ప 45

143 ఆ॥ వె॥ ఇపుడు మేము నీకు • నిష్టంబులగు పూజ
లాచరింపకున్న • నైన నధిక
మైన నీకృపాక•టాక్ష వీక్షణములఁ
జక్కఁ జూచి తగఁ బ్రి•సన్నుఁ డగుచు॥ పం॥ ప 49

144 క॥ కోరినవారల కోర్కులు
నేరుపుతో నిచ్చి మనుప • నీకె ప్రియ మన్య
ల్నేరరు కరుణాకర నేఁ
గోరెద నీవిచ్చెదేనిఁ • గోరికె లభవా! స॥ ప 89

145 క॥ [1]నానును సఖ్యము పుణ్య
శ్లోకులతోఁ గాని తత్త్వ•శూన్యులు సంసా
రైక [2]విమోహులతోఁడం
గాకుండ నొనర్పుమయ్య • కంజదళాక్షా! ష॥ ప 402

146 క॥ నీపాదకమల సేవయు
నీపాదార్చకులతోడి • నెయ్యమును నితాం
తాపార భూతదయయును
దాపసమందార నాకు • దయసేయఁగదే॥ ద॥ ప 1273

147 శా॥ నీపద్యావళు లాలకించు చెవులు•న్ని న్నాడు వాక్యంబుల
న్నీపేరం బనిసేయు హస్తయుగము న్నీమూర్తిపై జూపుల
న్నీపాదంబుల పొంత మ్రొక్కు శిరము • న్నీసేవపై చిత్తము
న్నీపై బుద్ధులు మాకు నిమ్ము కరుణ•న్నీ రేజపత్రేక్షణా!
ద॥ ప 409

(1) మాకి (2) సమూహుల

148 క॥ బాలిశులమగుచు మిక్కిలి
మేలెఱుఁగని మమ్ము నీదు ♦ మించిన దయచేఁ
బాలించి యెత్తువెప్పుడు
చాలఁగ నిహపరములందు ♦ సకల సుఖంబుల్. పం॥ ప 48

149 క॥ వరమిూయఁదలఁచి మమ్మం
గరుణించితి కాక నిన్నుఁ ♦ గనుగొనుటకునై
యరసి నుతింపఁగ మాకుం
దరమగునే వరద! నీరద ♦ శ్యామాంగా! పం॥ ప 50

సర్వలఘు సీసము

150 సీ॥ నవవికచ సరసిరుహ ♦ నయన యుగ నిజచరణ
గగనచర నది [1] నిఖిల ♦ నిగమవినుత
జలధిజని కుచకలశ ♦ లలిత మృగమద రుచిర
పరిమళిత నిజహృదయ ♦ ధరణిభరణ
ద్రుహిణముఖసుర నికర ♦ విహిత నుతి కలితగుణ
కటిఘటిత రుచిరతర ♦ కనకవసన
భుజగ రిపువరగమన ♦ రజత గిరిపతి వినుత
సతతధృత జపనియమ ♦ సరణిచరిత

తే॥ గీ॥ తిమి కమఠ కిటి నృహరి ♦ [2] సమితబలినిహిత పద
పరశుధర దశవదన ♦ కరవిదళన
మురమథన కలికలుష ♦ [3] ముదపహృతి నిపుణ కరి
వరదముని మనుజసుర ♦ గరుడవినుత! ఏ॥ ప 72

151 ఉ॥ తోయరుహోదరాయ భవ ♦ దుఃఖహరాయ నమోనమః పరే
శాయ సరోజకేసర పి ♦ శంగ వినిర్మల [4] దివ్య ధర్మ వ
స్త్రాయ పయోజసన్నిభ ప ♦ దాయ సరోరుహ మాలికాయ కృ
ష్ణాయ పరాపరాయ సుగు ♦ ణాయ సురారిహరాయ వేధసే॥
చ॥ ప 920

(1) జనితనిగము (2) ముదితబలి (3) సముదపహృతి (4) దివ్యనవ్య

152 ఉ॥ ¹భూరివివేకి తాపహ విభూతిసమేత మహాత్మ దీనర
క్షా రతినొప్పు నీవు చిర • కాలము నన్సుఖవృత్తి నీరు మా
వారలటంచు బుద్ధి నన • వద్య దలంచిన యల్పమాత్రి స
త్కారమె చాలునట్లగుట • గాకిటు సన్నిధివైతి వీశ్వరా!
చ॥ ప 923

153 తే॥ గీ॥ నిన్నుఁజూడని కన్నులు • నిష్ఫలములు
నిన్ను నొడువని జిహ్వ దా • నీరసంబు
నిన్నుఁ గానని దినములు • నింద్యములగుఁ
గన్నులనుఁజూచి మమ్మను • గారవింపు॥ ఏ॥ ప 120

154 క॥ నీమదిఁ దోఁపని యర్థం
బీ మేదినియందుఁ గలదె • యీశ్వర భక్త
స్తోమసురభూజ త్రిజగత్
క్షేమంకర దీనరక్షఁ • జేయు మురారీ! ద॥ ప 650

155 చ॥ గరుడుని మూఁపుపై పదయు • గంబు ఘటిల్లగ శంఖచక్ర వ
ర్మరుచిర శార్ఙ్గఖడ్గశర • రాజిత పాశగదాది సాధనోత్కర ని
కరంబు లాత్మకర • కంజములన్ ధరియించు భూతిసం
భరిత మహాష్ట బాహుఁడు కృ • పామతితో ననుఁగాచుఁగావుతన్॥
ష॥ ప 300

156 ఆ॥ వె॥ ²ప్రకటమకరవరుణ • పాశంబులందుఁ
జలములందు నెందు • బొలయకుండ
గాచుఁగాక నన్ను • ఘనుఁడొక్కఁడైనట్టి
మత్స్యమూర్తి విద్య • మానకీర్తి॥ ష॥ ప 301

157 క॥ వటుఁడు సమాశ్రితమాయ
చటుఁడు బలిప్రబలశోభ • నప్రతిఘటనో
ద్భటుఁడు త్రివిక్రమదేవుఁడు
చటుల ³స్థలమందు నన్ను • సంరక్షించున్॥ ష॥ ప 302

---

(1) భూరిశివేతరాపహాభిభూత్వ (2) వరుణ జలనిధికూపపాశంబులందు (3) స్థలివలన

158 చ॥ అడవుల సంకటస్థలుల • నాజిముఖంబుల నగ్నికీలలం
దెడరులనెల్ల నాకు నతి • కెక్కఁగ దిక్కగుఁ గాక శ్రీనృసిం
హుఁడు [1] కనకాక్ష రాక్షస వధోగ్రుఁడు విస్ఫురితాట్టహాస వ
క్త్రుఁడు ఘనదంష్ట్ర పావక విధూత దిగంతరుఁ డప్రమేయుఁడై॥
ష॥ ప 303

159 చ॥ అరయఁగ నెల్ల లోకములు • నంకిలి నొంద మహార్ణవంబులో
[2] నారిగి నిమగ్నమైన ధర • నుద్ధతి గొమ్మున నెత్తినట్టియా
కిరిపతి [3] యగ్నికల్పుఁ డురు • ఖేలుఁడు నూర్జిత మేదినీ మనో
హరుఁడు గృపావిధేయుఁడు స • దాధ్వములన్నుగాచుఁగావుతన్ ।
ష॥ ప 304

160 క॥ రాముఁడు రాజకులైక వి
రాముఁడు భృగుసత్కులాభి • రాముఁడు [4] సుగుణ
స్తోముఁడు నను రక్షించును
శ్రీమహితోన్నతుఁడు నద్రి • శిఖరములందున్॥ ష॥ ప 30

161 సీ॥ తాటకి మర్దించి • తపసి జన్నము గాచి
హరు విల్లు విఱిచి ధైర్యమున మెఱసి
ప్రబలులైనట్టి విరాధక బంధోగ్ర
ఖరదూషణాది రాక్షసుల దునిమి
వానరవిభు నేలి • వాలిఁ గూలఁగనేసి
జలరాశి గర్వంబు • చక్కఁజేసి
సేతువు బంధించి • చేరి రావణకుంభ
కర్ణాదివీరుల • కడిమిఁ ద్రుంచి
తే॥ గీ॥ యల విభీషణు లంకకు • నధిపుఁ జేసి
భూమిసుత గూడి సాకేత • పురమునందు
రాజ్యసుఖములు గైకొన్న • రామవిభుఁడు
వరుస ననుఁ బ్రోచుచుండు ప్రవాసగతుల॥
ష॥ ప 306

(1) సురశత్రుయూథప (2) నురుతరమగ్న (3) యజ్ఞకర్మ (4) శాంతి

162 ఉ॥ రామగుణాభిరామ దిన • రాజకులాంబుధిసోమ తోయద
శ్యామ దశానన ప్రబల • సైన్యవిరామ సురారిగోత్రసు
త్రామ సుబాహుబాహు బల • దర్పతమః పటుతీవ్రధామ ని
ష్కామ సుభ్రూల్లలామ గర • కంఠసతీసుత నామ రాఘవా!
ద్వి॥ ప 288

163 క॥ అమరేంద్ర సుతవిదారణ
కమలాప్తతనూజ రాజ్య • కారణభవ సం
తమసదినేశ్వర రాజో
త్తమ దైవత సార్వభౌమ • దశరథరామా॥ ద్వి॥ ప 289

164 క॥ రామ సమంచితముక్తా
దామ యశఃకామ ఘనసు • ధాధామ రుచి
స్తోమ జయసీమ జగదభి
రామ గుణోద్దామ నిఖిల • రాజలలామా॥ ద॥ ప 589

165 క॥ సర్వము నీవయి యుండుదు
సర్వవిలోకనుఁడవీవ • జగదధిపతివిఁక
సర్వాపరాధి నను నో
సర్వేశ యనుగ్రహించు • చనియెద నింకన్॥ ద॥ ప 579

166 క॥ నీదిక్కుగాని వారికి
నేదిక్కును వెదకనుండ • దిహపరములకు
నొంకదింపఁ దలఁచువారికి
నీదిక్కే దిక్కుసుమ్ము • నీరజనాభా॥ ష॥ ప 340

167 ఉ॥ ఆకలిగొన్న క్రేపులు ర • యంబున నీఁకలు రాని పక్షులు
న్నీకొని తల్లికి న్మఱివి • దేశగతుండగు భర్త కంగజ
వ్యాకులచిత్తయైన జవ • రాలును దత్తరమందుభంగి నో
శ్రీకర పంకజాక్ష నినుఁ • జేరఁగ నామది గోరెడుం గదే!
ష॥ ప 401

168 మ॥ మునుఁ గల్పాంతమునందుఁ గుక్షి నఖిలం•బుం దాచి యేకాకివై
జన లోకోపరిలోకవాసులును యు•ష్మత్తత్త్వమార్గంబు చిం
తనముం జేయఁ బయోధియందు నహిరా•ట్తల్పంబునం బవ్వళిం
చిన నీరూపము[1] నేఁడు జూపితివి ల•క్ష్మీనాథ! దేవోత్తమా॥
చ॥ ప 199

169 మ॥త్త॥ కంటిఁ గంటి భవాబ్ధి దాఁటఁగఁ•గంటి నాశ్రితరక్షకు
న్గంటి యోగిజనంబు డెందము•గంటి జుట్టముఁ గంటి ము
క్కంటికిం గనరాని యెక్కటిఁ•గంటి దామరకంటిఁ జే
కొంటి ముక్తినిధానముం దల•కొంటి సౌఖ్యములందఁగన్॥
తృ॥ ప 147

170 సీ॥ దండంబు యోగీంద్ర•మండల నుతునకు
దండంబు శార్ఙ్గకో•దండునకును
దండంబు మండిత•కుండల ద్వయునకు
దండంబు నిష్ఠుర•భండనునకు
దండంబు మత్తవే•దండ రక్షకునకు
దండంబు రాక్షస•ఖండనునకు
దండంబు పూర్ణేందు•మండలముఖునకు
దండంబు తేజఃప్ర•చండునకును
తే॥ గీ॥ దండ మద్భుతపుణ్య ప్ర•ధానునకును
దండ ముత్తమ వైకుంఠ•ధామునకును
దండ మాశ్రిత రక్షణ•తత్పరునకు
దండ మురుభోగినాయక•తల్పునకును॥ ష॥ ప 336

171 ఆ॥ వె॥ వాసుదేవ కృష్ణ•వరదస్వతంత్ర వి
జ్ఞానమయమహాత్మ•సర్వపుణ్య
పురుషనిఖిలబీజ•భూతాత్మకబ్రహ్మ
నీకు వందనంబు•నిష్కళంక॥ ద॥ ప 943

(1) జూడఁగంటి మిది రాజీవాక్ష విశ్వాత్మకా

172 ఆ॥ వె॥ పరమపురుష దుఃఖ • భంజనపరమేశ
భక్తవరద కృష్ణ • భవవిదూర
జలరుహాక్ష నిన్ను • శరణంబు వేడెద
మభయమిచ్చి కావు • మయ్య మమ్ము॥ ష॥ ప 342

సంపూర్ణము.

—oo✿✿oo—





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA128B102 |
| పుస్తకం పేరు | భాగవతసార ముక్తావళి |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 249 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | II, IV, XXIV |
| NO PAGES | 1TO4 |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | munisha |
| Scan | Ch. Ramya |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |